The First Telugu Bi-Weekly in Andhra Desa. The only Telugu News Paper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కను



GOLAKONDA PATRIKA HYDERABAD Dn.

సంపుటము ౫ } ప్రజోత్పత్తి నామ సంవత్సర చైత్ర బ॥ ౨ శనివారము 4-4-31 { సంచిక ౫౭

# కరాచీ కాంగ్రెసు మహాసభ

## స్వరాజ్య ప్రభుత్వములో పౌరుల హక్కులు

గాంధీ ఇర్విను ఒడంబడిక తీర్మానముపై మహాసభలో మూడు గంటలసేపు చర్చ జరిగిన పిదప అత్యధిక సంఖ్యాకులచే నామోదింప బడెను.

వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యము, ఇతర ప్రధానములైన హక్కులగూర్చియు, పనివాండ్ర విషయమునను, సైన్యము ఖర్చు తగ్గించుటకును, ఉప్పుపన్ను తొలగించుటకును, నొకతీర్మానము చేయబడెను

ఇదియే కాంగ్రెసువారు సాధించదలచిన పూర్ణస్వరాజ్యమా?

## సంస్థాన ప్రజల గతియేమి?

### ద్వితీయ సమావేశము

గాంధీ ఇర్విను ఒడంబడిక చర్చ వివరములు

మార్చి ౩౦ వ తేది సాయంకాలము అఖిలభారత జాతీయ మహాసభ ద్వితీయ దిన సమావేశము ప్రారంభమయ్యెను. గాంధీ ఇర్విను ఒడంబడిక నామోదింప వలెను. గాంధీగారి నాయకత్వముక్రింద రౌండు టేబిలు సభకు ప్రతినిధులను నియమింప వలెను. వారికి పరిమితితో కూడ స్వాతంత్ర్యము నియ్యవలెను" అను ఆయువవ తీర్మానమును పండిత జవాహర్లాలుగారు ప్రతిపాదించిరి

౧౦ దేండ్ల క్రితము మనము లాహోరులో స్వాతంత్ర్య పతాకమును లేవనెత్తితిమి. ఈ ౧౨ నెలలలోను సమరతతో మనము స్వరాజ్యపథమును సాగించితిమి, నేడు సంధి విషయింబిన తీర్మానమును నుపపాదించుచుంటిమి. అందువలన పూర్ణ స్వాతంత్ర్యా దర్శమునుగూర్చి కొందరికి సంశయములు కలిగినవి. ఇంతవరకును మనము ప్రత్యక్షక్రియచే పోరు సాగించుచుంటిమి. ఇప్పుడు ఆలోచనల వలనను రాయబారములవలనను చర్చల వలనను పూర్ణస్వరాజ్యము లభింపగలదేమో పరీక్షించుట కీప్రజావిధానమునుగూడ పరీక్షింపదలచితిమి. పూర్ణస్వరాజ్యమునగా నేమో యీ తీర్మానము నందు నిర్వచింపబడెను. మనము రౌండుటేబిలు సభకు వెళ్లుటవలన నెట్టి ప్రయోజనమును కలుగదనియే యీ సభవారు నిశ్చయించుచో నిడల మన మా సభకు వెళ్ల నవసరము లేదు. కావున రౌండుటేబిలుసభకు వెళ్లవలసిన కాంగ్రెసు ప్రతినిధుల పేర్లనుగూర్చి యిప్పుడింక ఆలోచింప నవసరము లేదు. రౌండుటేబిలు సభకు మన ప్రతినిధులు వెళ్లి అచట చర్చించుట వలన మనదాస్యశృంఖలాబంధము లింకను బిగింపబడునే గాని సడలింపబడవని వారికి తోచినచో వారటనుండి రాగానే సత్యాగ్రహము ద్విగుణీకృతోత్సాహముతో సాగింపబడును, కావున మన ప్రతినిధులు మహాసభవారు నిర్ణయించిన పరిమితి నతిక్రమించకుండుటయును కనుగలిగి మెలగుటయును మాత్రమే అవసరమగును అని పండిత జవాహరలాలుగారు నుడివిరి

ఈ తీర్మానమును డాక్టరు అన్సారీగారు బలపరచిరి. జమ్నాదాసు మెహతాగారు ఈ తీర్మానమునకు ప్రతికూలముగా నిట్లు మాట్లాడిరి

ఈ తీర్మానము నుపపాదించినవారు యెంతటి ధీరోక్తి అని పలికినను పూర్ణస్వరాజ్య తీర్మానమున కిది భంగకరమగుట కెట్టి సంశయమును లేదు. రౌండుటేబిలు సభకు ప్రతినిధులను పంపుటను మహాసభవారు సమ్మతించుటతోనే పూర్ణస్వరాజ్య తీర్మానము భగ్నమగును రక్షణలను కేటికైన నామోదించినచో నది యెంతమాత్రమును పూర్ణస్వరాజ్యమనబడును. కనుకాలముగా నుండదు. రక్షణలతో కూడిన ఒక రూపాయిని అనినచో అది పూర్తిగా ౧౬ అణాలు కాజాలదు. అచటచట కొన్ని అణాలు కొరతగానే యుండగలవు. ఈ ౧౨ నెలలలోను స్వాతంత్ర్య శబ్దమునకు నాలుగు విధములుగా అర్థము చెప్పబడెను. మొదటిది పూర్ణస్వరాజ్యముగా నుండెను. తరువాత పదకొండు విషయములుగా మారెను. పిమ్మట స్వాతంత్ర్యసారముగా పరిణమించెను. చివరకు అత్మ నిగ్రహముతో గూడిన స్వపరిపాలనముగా తేలెను. కావున నిప్పుడు పూర్ణస్వరాజ్య మనగా నేమో అర్థమింతవాడుగూడ సరిగా గ్రహింపజాలడు. ప్రభుత్వ ఋణములను గూర్చి నిష్పాక్షికముగ విచారణ జరుపవలెను విషయమున కెంతో ప్రాముఖ్యత యియ్యబడెను

స్వామి గోవిందానందగారుకూడ నీ తీర్మానము నెదిర్చిరి. మహారలీగారు బ్రిటిషుసామ్రాజ్యవాదుల హృదయము లెంతమాత్రము మారలేదనియు కనుక సమాధానమెంత మాత్రము కుదరదనియు వారు తలంచుచున్నారనియు తెలిపిరి. భగతుసింగును ఉరితీయుటకే ఈ రౌండుటేబిలు సభ నియమింపబడెనని ఇటీవల జన్మించిన పిచ్చిపేర్లు గారనిరి. డాక్టరు ఆలం డాక్టరు కిచ్లూ, సేను గుప్త, సత్యమూర్తిగారలు బలపరచిరి, సరిహద్దు కాంగ్రెసు నాయకుడును, అచటివారిచే అపరగాంధీయని పిలువబడుచున్నవారును అబ్దుల్ గఫారుఖానుగారు తీర్మానమును బలపరచుచు గాంధీగారి ఆజ్ఞలను సంపూర్ణ విధేయతతో నెరవేర్చుటయే ముఖ్యకర్తవ్యమనియు, అఫ్ఘనులవలె కత్తులతో పోరాడవలసిన సమయము వచ్చినప్పుడు మతకలహములన్నియు సమసిపోయునవనియు అదే పద్ధతిని భారతీయులుకూడ అవలంబింపదగునవనియు ప్రబోధించిరి.

అనంతరము గాంధీ మహాత్ముడు చర్చను ముగించుచు ఇట్లుపన్యసించెను —

ఢిల్లీ ఒడంబడికవలన ఆశాభంగమును చెందియున్న యువకులయందు నాకు అధికముగు ప్రేమకలదు. వారు ఆగ్రహమును చెందుటకు వారికి హక్కుకలదు. కాని నేను సత్యాగ్రహినగుటచే నావిధిని నేను స్పష్టముగా గ్రహించియే యున్నాను. శత్రువులను ప్రేమతోవ వశపరచుకొనుటయే నా శాస్త్రముయొక్క మతము. మిత్రభావముతో ప్రత్యర్థి చేయి చాచినపుడు నేను దానిని తిరస్కరింపజాలను, ఒడంబడిక కు నేనును బాధ్యుడను, భారత కాంగ్రెసు కార్యసంఘ సభ్యులుగూడ సంతకము బాధ్యులే. కాని దానిని తిరస్కరించుటకు కార్యసంఘమునందు అవిశ్వాసమును ప్రకటించుటకును యీ మహాసభవారికి సంపూర్ణాధికారము కలదు. గాని వారటులచేసి కాంగ్రెసు కార్యములను నెరవేర్చుటకు క్రొత్త

(౩ వ పేజి చూడుడు)

## ఆర్యసమాజ వార్షికోత్సవము

౩౦౦౦౦ జనులు సమావేశమగుట

అపూర్వమగు సుత్సాహము

హైదరాబాదు నగరములో గురువారము నుండి హిందువులలో నపూర్వమగు నుత్సాహము ప్రబల్లియున్నది. బుధవారము నాడు సాయంత్రము వందలకొలది జనులు పండిత్ రామచంద్రజీ వారిని ఆర్యసమాజపు ఉపన్యాసకులను నూరేగింపుతో తీసికొని పోయిరి. కాని నగరరక్షక శాఖవారికి యూరేగింపులో కొన్ని యాక్షేపణములు కలిగినట్లున్నవి. చారిమినారు దగ్గఱ నొక యువకుడు కత్తిపట్టుకొని పోవుచుండుటను పరీక్షించి యిది యీ నగరములో నిషిద్ధము చేయుట యాక్షేపణీయమని నిలిపిరట మరియు నొక జండాపై "సారే సంసార్ కూ ఆర్యాబనావ్" అను మాటలలో ఆక్షేపణీయమగు మాటలు దొరికినవట. అయినను పోలీసువారి యాజ్ఞల శిరసావహించి జనులు వారు చెప్పిన రీతి నడచినారు.

గురువారము మధ్యాహ్నము ౨ నుండి ౪ గంటల వరకు మతవాదములు జరిగెను. పంజాబునుండి కొందఱు మౌల్వలు దేవనిగా "శంకా సమాధానము" నకై ప్రశ్నల జాబితాతో వచ్చియుండిరి. వారు వేసిన ప్రశ్నలివి.

౧ వేదము సర్వప్రపంచమున కేర్పడి దని యెట్లగును?

దీనికి రామచంద్రజీగారు వేదప్రమాణము లిచ్చి సమాధానము చేసిరి.

౨ నియోగమును గురించి వేదములో వ్రాసియున్నారు. ఇది వ్యభిచారముకాదా? యని రెండవ ప్రశ్న.

యీప్రశ్నకు తక్కిన కాలమంతయు వ్యర్థమయ్యెను నియోగమాపద్ధర్మమనియు, అట్టినియోగము భర్తనపుంసకుడైన లేక యట్టియితరకారణములు గలిగిన ౧౧ రు పురుషులవరకు స్త్రీ సంతానేచ్ఛతో నియోగము చేయవచ్చునని విషయమునకు రామచంద్రజీ గారు సమాధానము చెప్పుచు ఖురానులోకూడ ఆపద్ధర్మముగా పంది మాంసము తినవచ్చుననియు ముసల్మానులలో తల్లాఖు పద్ధతిపై స్త్రీ ౧౧ కాదుకదా లెక్కలేనన్ని పతుల పొందవచ్చునని యున్నదనియు ఖురాను లోని ఆయతులను జదివి సమాధానము చెప్పిరి. ఇట్లు మౌల్వీల శంకలన్నియు లఘుశంకలుగా బరిణమించెను.

సాయంకాలము ౬ గంటలనుండి ౯ గంటలవరకు ఉపన్యాసములు జరిగెను అందు సుసత్యదేవుగారు కర్మ సిద్ధాంతమును చెప్పుచు బైబిలు ఖురానులుగూడ నొప్పుకొనుటను నిరూపించిరి. తదుపరి యొక ఆర్యుడు గానముచేసెను అటు తర్వాత రామచంద్రజీగారు ఇట్లుపన్యసించిరి.

### ఉపన్యాస సారాంశము

వేదమందు జ్ఞానము సూర్యునితో పోల్చబడినది. అజ్ఞానము చీకటి. సూర్యోదయము కాగానే ప్రతివానినీడ వాని వెనుకకు దూరముగా పోవును. అనగా వేదప్రకాశముఅయిన అజ్ఞానము వెనుకకుబడును. సూర్యుడు నెత్తిపై వచ్చువరకు నీడ ప్రతివాని కాళ్ళక్రిందకి వచ్చును. అనగా సంపూర్ణజ్ఞానము కలిగినతర్వాత అజ్ఞానము కాలిక్రిందికి పోవును. దాగిపోవును. కాని పూర్తిగా పోదు అనగా మనుష్యుడెంత జ్ఞానియైనను దేవుడు కానేరడు. కాని దేవునికి సంపూర్ణ సన్నిహితుడగును. కావున వేద ప్రచారము ప్రతివాని ధర్మమైయున్నది. వేద ప్రచారమన జ్ఞానప్రచారము. వేదప్రచారము అందరికి చేయకూడదని పూర్వాచారులందురు. అది పొరపాటు వేదప్రచారముచే వేదముయొక్క ఘనతకు లోపముండదు. వెలుతురున్నచో చీకటిపోవును. కాని వెలుతురును చీకటిలో గాని పోయిన చీకటి వెలుతురును మింగివేయునని యెవ్వరను తలంచరుకదా! అదేప్రకారమే వేద ప్రచారము. ఒకవైద్యుడు తనమందును జాడ్యస్థుల కిచ్చిన తన మందుకే జాడ్యములంటుకొనునని తలంచు వెఱ్ఱికాడుకదా! అటులే వేదప్రచారము. ఒక క్రైస్తవుడు మీ వేదమందు క్రైస్తవులకు వేదము నుపదేశింపుము. అని వ్రాసియున్నదాయని యడిగెను. ఇది మూర్ఖప్రశ్న వేదమందు సమస్తజనులకు వేదోపదేశము చేయుమని యున్నది. సమస్త జనులలో క్రైస్తవులు నున్నారు. ఈ ప్రశ్నయడుగుట ఒక లబ్బెవాడు దొంగతనము చేయగా న్యాయాధికారి శిక్షింప వాడిట్లనెనట.

"అయ్యా నీ శాస్త్రమేదొంగతనమునకేమి శిక్షయున్నది. ఆ శిక్షలో లబ్బెవాడు దొంగతనముచేసిన శిక్షింపవలెనని యున్నదా చెప్పుమని" అన్నట్లున్నది.

"సత్యమహిం గిశీరం జాతవేదం—" అను మంత్రములో దేవుడుతాను ప్రపంచములో దస్యునికి ఆర్యునికి భేదము చూడడనియు తన వ్రితమందు నిమగ్నుడైన వానినే నుద్ధరింతుననియు చెప్పియున్నాడు. కావున కొందరు పూర్వాచారులు తలచునట్లు అంత్యజులు మున్నగు వారికి వేదము చెప్పకూడదనుమాట తప్పు. మన శరీరము మలినముగా నుండునప్పుడు దానిని మనము పరిశుద్ధముచేసికొని వ్యవహారములలో నడపుకొందుమో అదేప్రకారము అస్పృశ్యులైనను సరియేవారు పరిశుద్ధులైన వెంటనే వేదమునకర్హులగుదురు.

మనపూర్వాచారులిట్లు ప్రతిదానికిని మన శాస్త్రము లేమిచెప్పును అని గ్రంథములు చూతురు. ఇది మూర్ఖము. ఒక వైద్యుని దగ్గఱకు జాడ్యస్థుడు పోయిన వైద్యుడు తన చికిత్సల జాబితానంతయు చూచి వాని జాడ్యమునకు తగినమందు లేనందునన్నా చికిత్సకు తగినట్టిజాడ్యము సంపాదించుకొని వచ్చిన మందిత్తును అనినట్లుండును. వేదములలో ప్రపంచధర్మములను చెప్పుదురు. ప్రతి ప్రత్యేక వస్తువును వేర్వేరుగా చర్చింపవు కావున మనము కాలపరిస్థితులు మారుకొలది మన సనాతన ధర్మములను సనాతన ప్రవృత్తులకు సరిపడునట్లనేర్పయించుకొనవలెను. తెలివిగల వైద్యుడును తన వైద్యశాస్త్రజ్ఞానము నాధారముచేసికొని జాడ్యములకు తగినట్లుగా మందిచ్చును.

దయానంద మహర్షి యట్టివైద్యుడే. నిర్జీవమై పోవుచున్న హిందూమతమునకు ప్రచండశక్తిని కలిగించెను. వారి యభిప్రాయములు బహుజనాంగీకారము లైనవి. కావున వారి యభిప్రాయరీత్యా వేదప్రచారము చేయుట ప్రతివాని ధర్మమై యున్నది.

### రెండవదివసము

నిన్న (శుక్రవారము) నాడు కార్యక్రమములో నున్నప్రకారము భజన మున్నగునవి జరిగిన పిమ్మట రాత్రి ౭-౧౧ గంటలకు తర్కభూషణ పండిత రామచంద్రజీగారు సత్యముగూర్చి ఒక గంటకన్న నెక్కువకాలము నెక్కుడు యుదాహరణము లిచ్చుచు ఉపన్యసించిరి. వారి యుపన్యాస సారాంశము క్రింద పొందుపఱచబడుచున్నది:--

సత్యము రెండువిధములు. ఒకటి అనాదియము. రెండవది తాత్కాలికము. వేదములు అనాదియములు: ఇవి పరమేశ్వరునిచే సృష్టింపబడినవి ఇందు తాత్కాలిక సత్యము లేదు ఇందుగల విషయములు అనుభవముచే తెలిసికొనదగినవి. పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు. సర్వకార్యములు పరమేశ్వరుని ఇచ్ఛచే జరుగును పవిత్రమగు ఖురాను గ్రంథమునందు తాత్కాలిక సత్యములే గలవు "లాహిలాహి ఇల్లిల్లా" అనునది అనాదియ సత్యము. కాని "మహమ్మదు రసూలిల్లా" మాత్రము తాత్కాలిక సత్యము

మధ్యాహ్నము ౧౦ గంటలకు ముల్లాలకును రామచంద్రజీగారికిని "శంకా సమాధాన" సందర్భమున తీవ్రచర్చలు జరిగినవని తెలియుచున్నది

## సూచన

"కీ. శే పింగళిజనార్ధన రెడ్డిగారి జీవితము. రచనలు, అను తెలుగు గ్రంథము గ్రంథాలయములకు మాత్రమె ఉచితముగా నొసగుటకై ప్రకటించియున్నాము, కాని, పలువురు మహాశయులు గ్రంథాలయముల పేరు దెలుపకయే మాకు కార్డులు వ్రాయుచున్నారు అట్టిచో గ్రంథము బంపుటకు వీలుపడదు దయచేసి ఆయాగ్రంథాలయముల నామములు దెలుపుచు ఉత్తరములు వ్రాయ ప్రార్థితులు.

మేనేజరు

గోలకొండ పత్రిక

### గాంధీపటము గలభా

పెనివాడపల్లి (రాజమండ్రిసమీపము) రథోత్సవ సందర్భమున రథముపై గాంధీగారి పటముయుంచుటగూర్చి కాంగ్రెసువారికిని, వేరొక తెగవారికిని తగవువచ్చెను. వాదము పెరిగి దెబ్బలాటవచ్చెను, పోలీసువారు కొందఱి యున్నంతన స్వసంరక్షణార్థమై తుపాకులు కాల్చిరి ఇరువురు చనిపోయిరనియు, కొందఱు గాయపడిరనియు తెలియుచున్నది




# కరాచీ కాంగ్రెసు

(౨)

కరాచి కాంగ్రెసునందు గావింపబడిన తీర్మానములలో గాంధీ ఇర్విను ఒడంబడికను గూర్చినట్టియు, భావి రాజ్యాంగ విధానమున ప్రజల హక్కులను గూర్చినట్టియు, తీర్మానములు ముఖ్యమైనవి. ఇటీవల గాంధీ ఇర్విన ఒడంబడికను గూర్చి దేశమంతటను తీవ్రచర్చలు జరుగుచుండెను. గత సంవత్సరము సత్యాగ్రహమున జయప్రదముగా సాగించిన యువకబృందము ఈ రాజీనామా వలన యత్నము వమ్ము చెల్లాచెదరైపోయెనని భావించెను. భగత్సింగు ప్రభృతుల ఉరితీత యువకుల నాగ్రహపరవశుల గావించెను, తుదకు సుభాష చంద్రబోసు గారి వంటి నాయకులు కూడ ఈ యొడంబడికను గూర్చియే కాంగ్రెసుపై ధ్వజమెత్తిరి. కాని గాంధీ మహాత్ముని క్షమింపరాని యొడంబడిక ఆమోదింపబడెను. రౌండుటేబిలు సభలో కాంగ్రెసువారు పాల్గొనుటకై నిశ్చయింపబడెను. గాంధీ మహాత్ముడు కాంగ్రెసు ప్రతినిధి వర్గమునకు నాయకుడుగా నెన్నుకొనబడెను. ఇది యెంతయు సంతసనీయమైనది. ఏలయన రౌండుటేబిలు సభలో నాయకత్వము వహించుటకు మహాత్మునికి కన్న మిన్నయగు వ్యక్తి లేడనియే చెప్పవలయును

కాంగ్రెసువారు రౌండుటేబిలు సభలో పాల్గొనుచున్నప్పుడు వారెట్టి రాజ్యాంగ విధానమును కోరుచున్నారో తెలియుటకై ప్రజల ప్రాథమిక హక్కులకు సంబంధించిన తీర్మానమావశ్యకమయ్యెను. ఈ తీర్మానమును పలువురు నాయకులిది అవసరముగాదని ప్రతిఘటించిరి. తీర్మానమునందలి షరతులు అధిక సంఖ్యాకులచే అంగీకరింపబడవలయునని హెచ్చరించిరి. ఈ తీర్మానములోని కొన్ని షరతులు జమీందారులకును, ధనవంతులకును, రుచింపకపోవచ్చును. కాని మహాత్ముడు కోరునది బీదలగు రైతులకును, కార్మికులకును, స్వరాజ్యము రాగ వారి యభివృద్ధికై అట్టి షరతులుండవలసియే వచ్చును. లేనిచో భారతీయులలో అధిక సంఖ్యాకులు స్వరాజ్యము వలన లాభము పొందజాలరు.

భావి రాజ్యాంగ విధానము లేక పూర్ణ స్వరాజ్యమునకు క్రిందివి షరతులేర్పరచబడెను. వీనిలో భూమి శిస్తును తగ్గించుట, [అనగా ప్రత్యేక నిపుణత తప్ప లెక్కింపవలసిన రు ౫౦౦ల కన్న హెచ్చు వేతన మొసగరాదు.] పరదేశ వస్త్రములను నూలును రాకుండ జేయుట, ఉప్పు పన్నును తొలగించుట, మత్తు పదార్థములను నిరోధించుట అనునవి ముఖ్యమైనవి. వీనినే ప్రతిపాదిక రూపమున కాంగ్రెసు ప్రతినిధులు రౌండుటేబిలు సభలో ప్రవేశపెట్టెదరు. ఇట్టి షరతులు లేనట్టి రాజ్యాంగ విధానమును కాంగ్రెసువారెన్నటికిని సమ్మతించరు. ఈ విధానమును ననుసరించి భారతదేశము పాలింపబడినచో దేశీయులు సుఖజీవనమును గడుపగలరు. సైనిక వ్యయము తగ్గినచో హిందూదేశమున కెంతయో భారము తగ్గును. అధ్యక్షులగు పటేలు గారు నుడివినట్లు సైన్యము దేశ సంరక్షణకై వినియోగింపబడక పరదేశాక్రమణమునకై నుంచబడెనను సంగతి సరిహద్దు ప్రాంత నాయకులు తెలిపిన విషయములను బట్టి రూఢియగుచున్నది. అఫ్రిదీలు కూడ కాంగ్రెసు సహాయమపేక్షించుచు మహాత్ముని స్వయముగా వచ్చి పరిస్థితులను వీక్షించి పోవుటకు సందేశము నంపిరి. ఈ సందేశానుసారమే కాంగ్రెసులో నొక తీర్మానమామోదింపబడెను. కాని గాంధీ మహాత్ముని సరిహద్దు ప్రాంతమునకు పోకుండునట్లు ప్రభుత్వము వారేల యుత్తరువు గావించిరో తెలియకున్నది.

కాంగ్రెసు తీర్మానములలో సంస్థాన ప్రజల విషయమై నేదియు నెత్తకుండుటచే వారు భగ్నమనోరథులైరి. సంస్థాన ప్రజా మహాసభవారు సంస్థాన ప్రజల హక్కులగూర్చి యోచించవలసినదిగా మహాత్ముని కోరిరి. కాని మహాసభయందు వారి విషయమేమియు రానందున వారికి విచారము కలిగెను. భారతదేశ ప్రజ కంతకును బాధ్యత వహించునని తలచబడిన కాంగ్రెసు మహాసభ తద్దేశీయులగు సంస్థాన ప్రజల విషయమున నౌదాసీన్యము కలిగించుకొనకుండుటెట్లో తెలియకున్నది. ఒకవేళ బ్రిటిషు ఇండియా ప్రజలకు స్వరాజ్యము లభించిన వారి తోడి సోదరులగు సంస్థాన ప్రజలు తమ జన్మ హక్కులైన బడయక పూర్వస్థమందువలెనే యుండవలసినదేనా? వారి నడుగువారు లేరా? కొందరి ముఖ్యులగు నాయకులిందుకు పూనుకొనరా యను వాదము అప్పుడే యొకప్రక్క వినవచ్చుచున్నవి. అయినను సంస్థానపతులు కొందఱు తమ ప్రజలకు వారి హక్కుల నొసగనున్నదియు మరొకవైపున గనపడుచున్నది. అయినను కాంగ్రెసు వారు తమ పలుకుబడిని వినియోగించనిది సంస్థాన ప్రజలకు కూడ బ్రిటీషు ఇండియా ప్రజలకు నుండు హక్కులు లభించజాలవు. కనుక కాంగ్రెసువారు ముందైనను శ్రద్ధ వహించవలయునని కోరుచున్నాము.

మొత్తముపై కరాచీ కాంగ్రెసు భారతదేశమును ప్రస్తుత మెదుర్కొనుచున్న ముఖ్య సమస్యల దేశ పరిస్థితుల కనుకూలముగా పరిష్కరించెను. భారతీయ ఐక్యకంఠముతో నెట్టి రాజ్యాంగ విధానమును కోరుచున్నారో ప్రపంచమునకు చాటెను. ఉత్కళములో జరుగు కాంగ్రెసు మహాసభ వరకు భారతదేశమునకు స్వరాజ్యము లభించుగాక!

## తెక్క జబానీ పత్రికలు!

మా రాజకీయ శాఖవారు ప్రకటనార్థమై రౌండుటేబిల్ సభలో మన ప్రతినిధులు చేసిన చర్యలను గురించి పంపిన "కమ్యూనిక్"ను జూచినారము. అది స్థలాంతరమున ప్రకటింపబడినది. కాని యిప్పుడు మనప్రభుత్వమువారి చర్యలనుగూర్చి రెండుమాటలు చెప్పదలచినారము.

మొదటిది మాకు పంపిన విషయము ఇంగ్లీషులో పంపుట. మాపత్రిక తెనుగుపత్రిక. కావున తెనుగులో తర్జుమాచేయించి పంపవలెను. ఉర్దూ పత్రికల కన్నిటికిని ప్రభుత్వమువారే తర్జుమాచేసి పంపినారని వినుచున్నాము. అట్లైనచో ప్రభుత్వమువారు తెనుగు మహారాష్ట్ర కన్నడ భాషలలో సహితము తర్జుమాచేసి ప్రజలకెరిగించుట తమధర్మమై యుండెను. అయినను దీని విషయమున మాకంత యాక్షేపణము లేదు.

కాని యింకొక్క విషయము మాత్రము మాకాశ్చర్యమును గలిగించుచున్నది. ఈప్రభుత్వ ప్రకటనను సిద్ధము చేయుటకు పూర్వము రౌండుటేబిల్ ప్రతినిధులు రాష్ట్రమందలి ఉర్దూ ఇంగ్లీషు పత్రికాధిపతులను మ్యానే పిలిపించి వారితో ముచ్చటించి వారిని గౌరవించినారట. బుల్లెటిన్, ముషీరెదక్కన్, రహబరెదక్కన్, సుభేదక్కన్, మన్షూర్, నిజామ్ గజెట్ పత్రికాధిపతులు హాజరైయుండిరని ప్రభుత్వము వారు ప్రకటించియున్నారు. ఇందులో నొకవిషయము హైద్రాబాదు రాష్ట్రపత్రిక కానట్టి ఇండియన్ డెయిలీమేల్ పత్రికా ప్రతినిధి కూడ వెళ్లియుండెనట! ఏమిదింత! స్థానిక తెనుగు మహారాష్ట్ర పత్రికలను విచారించువారెవరు? ఏల యీపక్షపాతమో మాకర్థము కాదు. నిన్న మొన్నటి మన్షూరు కూడ ఆహ్వానింపబడెను కాని యేమి విచిత్రమో ౫ సంవత్సరములనుండి దేశసేవ చేయుచున్న గోలకొండపత్రిక నాహ్వానించిన పాపమునకు పోలేదు. ఇది నిజాంగజెటువలె వారపత్రిక కాదు. వారమునకు రెండుమారులు వెడలుటచేతను ౫ సంవత్సరములనుండి పనిచేయుట వలనను నిజాము గజెటుకన్న నెక్కువ యర్హతలను గలదని చెప్పవచ్చును. ఇంతియకాదు ౭౦ సంవత్సరముల నుండి దేశసేవ చేయుచున్న "నిజాము విజయ" మహారాష్ట్ర పత్రికకూడ వదలివేయబడినది. భాగ్యనగర [illegible] పత్రిక వదలివేయబడినది. దేశబంధు మాసపత్రికను స్మరించినవారే లేరు. ఈపత్రికలన్నియు తెనుగు మహారాష్ట్ర భాషలలో నున్నవి ఇదియే నేరమైన మేమేమి చేయగలము. పుట్టుకతో వచ్చిన యీ "దుర్భాషను" మానజాలము. ఉర్దూ ఇంగ్లీషు తప్ప తక్కిన దేశభాషలు మాయొంటె కాలిక్రింది దుమ్మని మాగుండ్రని బల్ల ప్రతినిధులు భావించిరాయేమి? అటుకాకున్న కారణము తెలుపగలరా? ఇకముందైనను ఈపత్రికల నవమానింపకుందురని తలచుచున్నాము.

## కాంగ్రెసు పత్రిక

కాంగ్రెసు పత్రిక కొండ్విడి లింగరాజు గారి సంపాదకత్వమున నీ సంవత్సరాది నుండి పునరుద్ధరింపబడెనని తెలుపుటకు సంతసించుచున్నాము. ప్రారంభదశ యగుటచే మొదటి రెండు సంచికలు ఎనిమిది పుటలే ప్రకటింపబడినవి. అయినను త్వరలో పూర్వరూపము దాల్చునని నమ్మెదము. కాంగ్రెసు ఆశయములను జనసామాన్యమునందు వ్యాపింపజేయుటకై పత్రికారాజము చిరంజీవియై వర్ధిల్లుగాక!

